## గంటలపంచాంగం

స్వభాను సం|| ఆషాఢ శు|| చవితి 1943 సం|| జూలై 6 మంగళవారం

మం|| చ రా 1-52 ఆశ్రే ఉ 8-51 వర్జ్యం రా 10-3 ల 11-49 వ.

శు|| పంచమి జూలై 7 బుధవారం

బు|| పం రా 3-32 మఘ ఉ 11-17 వర్జ్యం రా 7-59 ల 9-43 వ.



ఆంధ్రపత్రిక

స్వభాను సం|| జ్యేష్ఠ శు|| తృతీయ సోమవారము

# బట్టల ధరలు

బొంబయియందు సమావేశమైన టెక్స్టైలు బోర్డువారు దీర్ఘముగ చర్చించి కొన్నిరకముల బట్టలకు ధరలను ప్రకటించిరి. బోర్డు అధ్యక్షుడగు థాకర్సేగారు గావించిన ప్రకటన ప్రకారము మీదమీద మిల్లులయందు నాలుగు తరగతుల బట్ట తయారుచేయబడుచుండును. వానిలో నొకటి ప్రభుత్వమువారి కోరికపై తయారుచేయబడుచున్న "స్టాండర్డు గుడ్డ". రెండవది, వర్తకులు తగు మాత్రపు లాభములతో సరసమగు వెలకు విక్రయింపదగు ఇతర రకముల చవక బట్టలు. మూడవది, ప్రభుత్వశాఖలకు కావలసిన గుడ్డ. నాల్గవది, మిల్లులకు తమ యిష్టము వచ్చిన ధరకు విక్రయించుకొనదగు ప్రత్యేక రకముల గుడ్డలు. ఇవి కేవలము ఎగుమతికుద్దేశింపబడెను. వీనిలో స్టాండర్డు బట్టను పౌను 1-కి రు2-0-3 చొప్పున మిల్లుయజమానులు విడుదల చేసెదరనియు, దానిని రు2-2-0లకు మించకుండ చిల్లరవర్తకులు విక్రయింపవలెననియు నిర్ణయించిరి. ఇక సరసమగు ధరలకు విక్రయింపవలసిన బట్టలయొక్క వెలల గురించి తెలుపుచు, ఇవి గత మూడు నెలలలో గల రేటుకంటె నూటికి కనీసము 25 వంతులైన తగ్గుననియు, కాని ఎట్టిసందర్భములలో కూడ నూటికి 40 వంతులకంటె ఎక్కువ తగ్గినీయమనియు, థాకర్సేగారు ప్రకటించిరి.

ముందుముందు చవకబట్టల ధరలెటు లుండునో తెలియకపోవుటచే సందిగ్ధమున బడియున్న వర్తకులకీ ప్రకటన కొంతవరకు ధైర్యమొసగు ననుటకు సందియము లేదు. కనీసపు ధరలు తెలిసినవి గనుక, వర్తకు లికమీద కొత్త కొనుగోళ్లను సాగింపవచ్చును. కాని, థాకర్సేగారిపుడు ప్రకటించిన ధరలు ఎంతవరకు సరసమైనవను విషయముమాత్రము చాల వివాదాస్పదము. వీరి అంచనాల ప్రకారము గతమూడు నెలలలో రు 3-12-0లకు విక్రయింపబడెడి 1 పౌను తూకము గల గుడ్డ ఇకమీద రు 2-10-0 లకంటె ఎక్కువధరకు విక్రయింపరాదు; రు 2-4-0 లకు తగ్గరాదు. సంగ్రామారంభమున ఇదే గుడ్డ ధర 9 అణాలు. అనగా నాటి ధరలతో పోల్చినయెడల, థాకర్సేగారిపుడు ప్రకటించిన కనీసపు ధరలు, నాల్గురెట్లు. వెనుకటికంటె ప్రత్తి, పనిముట్లు మొదలగు వాని ధరలును కూలియు హెచ్చిన వను మాట నిజమే. కాని, థాకర్సేగారి లెక్కల నంగీకరించినను గూడ, నేడు గుడ్డ ధర, రెండు, రెండున్నర రెట్లకంటె హెచ్చుటకు వీలులేదు. న్యాయమగు లాభములను వేసుకొనినగూడ, మిల్లు లిపుడు స్టాండర్డు గుడ్డను రు 2-0-3 ల కొనగుటకంగీకరించుచున్నవి. దీనినిబట్టి, ఈ ధరకంటె ఎక్కువ వసూలు చేయుట అధిక లాభముల పొందుటయని స్పష్టపడుచున్నది. అంతియగాక, ప్రభుత్వమువారు గైకొనిన చర్యల ఫలితముగ గత మూడు నెలలలోకంటె, ఇపుడు ప్రత్తిధరలు క్రమముగ తగ్గుచున్నవి. కొంది కాలములో నవి ఇంకను చాల వరకు తగ్గును. వీనితో బాటు బట్టల ధర అపుడింకను తగ్గించుటకు వీలగును. అట్టిచో, థాకర్సేగారు, గుడ్డలధరను నూటికి 40 వంతులకంటె ఏమాత్రమును తగ్గనీయమనియు అంతకంటె తగ్గుచో, వానినేవిధముగనైనను హెచ్చించి నిలబెట్టుటకు చర్య గైకొనవలెనని కోరెదమనియు, ప్రకటించుట విచిత్రము. ప్రభుత్వమువారెట్టి సందర్భమునందును గూడ అట్టి చర్యలకు గడంగెదరని తలంపము. సాధారణమగు గుడ్డను ప్రజల శక్తికి అందుబాటులో నుండునటుల సరసమగు స్థితికి ధరలు తగ్గునటుల జూచుటయే ప్రభుత్వము వారి కర్తవ్యముగ నుండవలెను. ఈ దేశమున కార్మికుల ఆదాయము, సంగ్రామారంభమునుండి నూటికి 75 వంతులకంటె ఎక్కువ పెరుగ లేదని భారతమంత్రియే అంగీకరించియుండెను. ఇట్టి స్థితిలో గుడ్డలధర సంగ్రామపు పూర్వముతో పోల్చినయెడల రెండు రెట్లకంటె ఏమాత్రము అధికముగ నున్నను గూడ ప్రజలకు దుర్భరముగనే యుండును.

హైదరీగారి బోర్డు ప్రథమసమావేశమును ప్రారంభించుచు ప్రజలకు చవుకబట్టలను తయారుచేయు ప్రయత్నములను మిల్లు యజమానులు భగ్నపరుపదలచిరను వదంతుల నుడవారించిరి. ధరల గురించి బోర్డువారి నిర్ణయమును గాంచినయెడల నీయనుమానము నిరాధారమైనదను భావ మేర్పడుట కష్టము; ప్రభుత్వమువారీ బోర్డునందు మిల్లు యజమానులకే ప్రాధాన్యము నొసగిరి. పేదప్రజల కష్టసుఖముల నెరిగించు ప్రతినిధు లొక్కరును అందు లేరు. నూలు స్థితి గూడ ఇటులనే యున్నది. ఈ దేశమున బట్టల ఉత్పత్తిలో మూడవవంతు చేనేత పరిశ్రమనుండి వచ్చుచున్నది. మిల్లు నూలు నుపయోగించునదంతయు వారే. అందుచే నూలు కొనుగోలు దార్లుగ చూచినను, బట్టల ఉత్పత్తిదారుగ చూచినను గూడ చేనేతవారి శ్రామికుల కీబోర్డునందు తగు ప్రాతినిధ్య ముండవలెను. ఆ విధముగ ప్రాతినిధ్యము వహించగల సంఘము లెన్నియో గలవు. అయినను, ప్రభుత్వమువారీ పరిశ్రమ కెట్టి ప్రాతినిధ్యము నొసగియుండకపోవుట ఆశ్చర్యకరము. బట్టల పరిశ్రమయందు ఇంత ముఖ్యమగు శాఖను వదలివేసినచో, చవుక బట్టల సమస్యను అధికారులెటుల పరిష్కరింపగలరో దురూహ్యముగ నున్నది. ఈ విషయమును గుర్తించి అధికారులు చేనేత పరిశ్రామికుల ప్రతినిధులను, ప్రజాప్రతినిధులను గూడ బోర్డునందు చేర్చెదరని నమ్మెదము. లేనియెడల, ప్రజలందరను కలచివేయుచున్న చవుక బట్టలసమస్యను, మిల్లుయజమానుల దయాధర్మములకు వదలివేసినవారయ్యెదరు.

### అహమదాబాదులో లాఠీఛార్జి

అహమదాబాదు, జూలై 4:—

ఈనాటిరాత్రి అహమదాబాదులో రాయిపురం అనే పేటలో కొందరు కొంగదాలను పట్టుకొని పూరేగింపుతో బయలుదేరారు. పోలీసువారు వచ్చి వారిని గమ్మంచే పోలేదు. పోలీసువారు లాఠీఛార్జి చేశారు. ఒకడు పోలీసుస్టేషనుమీద రాళ్ళువిసిరాడు. వానిని అరెస్టు చేశారు.

# బట్టలకంట్రోలు ఆర్డరును సవరణ చెయ్యాలి

## అ. భా. బట్టలు నూలు వ్యాపారస్థుల మహాసభ

బొంబాయి, జూలై 4:—

అఖిలభారతబట్టలు నూలు వ్యాపారస్థుల మహాసభ బొంబాయిలో జరిగింది. 18 తీర్మానములు చేసిరి. బట్టల వ్యాపారవిషయంలో ఇండియా గవర్నమెంటువారు జారీచేసిన కంట్రోలు ఆర్డరువల్ల కలుగుచున్న ప్రతిబంధకములను, తొలగించవలెనని తీర్మానం చేసిరి.

మిల్లులలో తయారై బేళ్లుగా కట్టబడిన బట్టల సరకును ఒక నిర్ణీత వ్యవధిలోగా అమ్మవలెనని కంట్రోలు ఆర్డరులోని 14 (1) క్లాజులో నిర్వచింపబడెను. ఆరీతిగా సదరు సరకును అమ్మివేయని రెడల 22 క్లాజు ప్రకారము తీవ్రమైన దండన విధింపబడునని యున్నది. సదరు ఆర్డరులో ఇవ్వబడిన వ్యవధి చాలాతక్కువగానున్నది. నిబంధింపబడినదండన చాలాతీవ్రంగా ఉంది. సరకును అమ్మకం చేయగల వర్తకులు అనేక ప్రాంతాలలో తమ షాపులను అనేక ప్రాంతాలకు మార్చివేసియున్నారు. వారి కందరికిని మిల్లులనుండి సరకును పంపుటకు వ్యవధిచాలదు. కనుక సదరు ఆర్డరులో చెప్పబడిన వ్యవధికంటె ఎక్కువ వ్యవధి నొసంగవలెను.

బట్టల వర్తకుల ఈ బాధకములను తొలగించవలసినదిగ ఇండియా ప్రభుత్వానికి విన్నవించుటకై 8 మంది ప్రతినిధులు గల ఒక రాయబారవర్గమును పంపుటకు యీ సభవారు నియమించిరి.

కంట్రోలు ఆర్డరుద్వారా బట్టలధరలను తగ్గించి స్థిరీకరించనంతవల్లనే ప్రజలలో గ్రద్ధశీలవర్తకులకు భద్రత ఏర్పడగలదు. గనుక యీ కంట్రోలు ఆర్డరును యీ సభవారు హర్షించుచున్నారని తీర్మానం చేయబడెను.

మిల్లు ఆసాములకును బట్టల సరకును ప్రజలకువిక్రయించువర్తకులకును మధ్యవ్యాపారం చేసేవారు కొందరుకలరు. ఇట్టి మధ్యస్థ వ్యాపారస్థులతరపున కొందరు రెప్రజెంటెటివులు బోర్డులో నియమింపబడవలెను. కాని నియమింపబడలేదు.

కమిటీలలోకూడా లేరు. ఇది చాలా శోచనీయము.

దేశంలోని ప్రజావసరములకు కావలసిన గుడ్డ సప్లయి అగునంతవరకు బయటిదేశాలకు భారతదేశవస్త్రములు రవాణా కాకుండా అట్టి రవాణాలను గవర్నమెంటు నిరోధించాలి.

# బ్రిటిష్ ఆయుధోత్పత్తి సమృద్ధిగా ఉంది

## బ్రిటిషు మంత్రి ప్రకటన

లండను, జూలై 4:—

బ్రిటిషు యుద్ధసామగ్రి ఉత్పత్తిశాఖా మంత్రి-యగు ఒలివరు లిటిల్టను గారు నేడు ఆదివారంరాత్రి రేడియోలో ప్రసంగించుచు ఇట్లు చెప్పిరి:—

ఇప్పుడు మన సైన్యములకు కావలసిన గుండుమందుసామగ్రి చాలా సమృద్ధిగావుంది. అందువల్ల మందుగుండు సామగ్రి తుపాకులు వగైరా చిల్లర ఆయుధసామగ్రి ఉత్పత్తిని కొంతవరకు ప్రస్తుతం తగ్గించి, ఇక నావ లను నిర్మించుటలోను విమానాలను నిర్మించుటలోను ఎక్కువ శ్రద్ధ వహించవలసియున్నది.

జర్మనుమీద అమెరికనువిమానాలు పగటిపూట దాడిచేయుచున్నవి. బ్రిటిష్ విమానాలు రాత్రిపూట దాడిచేయుచున్నవి. ఇకముందు అమెరికా ఇంగ్లాండులయొక్క నౌకాదళమున్నూ మెట్ట సైన్యములున్నూ అన్యోన్యాశ్రయంగా వ్యవహరిస్తూ శత్రువు నెదిరించుచుండును.

### అమెరికానుంచి ఇంగ్లాండుకు అరువుకవులు

సప్లయిలు అరువుకవులు పద్ధతిప్రకారంగా అమెరికానుంచి ఇంగ్లండుకు ఈ 1943 సం||లో టాంకులు, విమానాలు వర్తకనావలు, యుద్ధనావలు, పైజెప్పినవానియొక్క వివిధభాగములు చాలా ఎక్కువగా పంపబడెను. ఈ విధంగా యీ 1943 సం||లో ఇంతవరకు సప్లయిచేయబడిన వానినన్నింటిని నిర్మించవలెనంటె 15 లక్షలమంది జనులు 12 మాసాలు పనిచేస్తే తయారు కాగలవు. అంతటి సప్లయి ఇంగ్లండుకు అమెరికా చేసింది.

ప్రస్తుతము బ్రిటిష్ సామ్రాజ్యంలోని దేశాలన్నియును కలిసి ఉత్పత్తిచేసే యుద్ధసామగ్రి సంఖను లెక్కకట్టితే, జర్మనీ, ఆస్ట్రియా, జెకోస్లావేకియా రాజ్యాలన్నీ కలిసి ఉత్పత్తిచేయుచున్న యుద్ధసామగ్రి కంటె చాలా హెచ్చుగాకన్నది.

# జపానును జయించడమే మన ప్రథమ కర్తవ్యం

## ఇండియా సర్వసేనాని ప్రకటన

ఢిల్లీ, జూలై 4:—

భారతదేశానికి వావెలుగారిస్థానే సర్వసేనాధిపతిగా నియమింపబడిన సర్ క్లాడు ఆకెన్లెక్కు గారు యీక్రిందిరీతిగా ఒకప్రకటన చేసిరి.

నన్ను భారతదేశమునకు సర్వసేనాధిపతిగా చక్రవర్తిగారు నియమించి నన్ను గౌరవించిరి. రెండుసంవత్సరముల సంగ్రామము జరిగిన తరువాత సేనాపదవిని తిరిగి వహించుచున్నాను.

రెండుసంవత్సరాల క్రిందట భారతదేశానికిపశ్చిమదిశనుండి శత్రుభయం కలిగింది. సిరియా, ఇరాకు, పరిషియాదేశాల మీదుగా జర్మనుసేనలు అప్పుడు దండెత్తి వచ్చుటకు ప్రయత్నంచేసెను. కాని రష్యాలోని రష్యనుసేనలున్ను మధ్యధరాసముద్ర ప్రాంతంలోని మన సైన్యములున్ను శత్రువుల ప్రయత్నములను సాగకుండా భంగమొనర్చెను.

ఇప్పుడు భారతదేశానికి తూర్పువైపునుంచి జపానులసేనల దండయాత్రాభయమొకటి ఏర్పడినది. జపాను సేనలను స్వస్థానములకు మనము తరుము కొట్టేవరకు యీ ప్రమాదభయము ఉండగలదు.

నాకుపూర్వము యీ సర్వసేనాధి పత్యమును వహించిన వావెలుసేనాని తనకుగల అసామాన్య అనుభవ జ్ఞానముతో భారతదేశ సైన్యములను చాలా కట్టుదిట్టముచేసెను. ఈ శత్రువును ఎదిరించుటకు వీలుగా సైన్యమును పునర్నిర్మాణం చేసెను.

వావెలుగారి పద్ధతులనే అనుసరించి నేను యీ కార్యభారమును నిర్వహిస్తాను.

జపాను సైనికులు చాలా మొండిపట్టుదలతో తమ దేశంకొరకు ప్రాణత్యాగం చేసే శూరులు అయినప్పటికీ, వారిని మనము ఓడించితీరాలి. అందుకొరకై మనము ఏకాగ్ర చిత్తంతో కృషి చెయ్యాలి. స్వసౌఖ్యములను స్వలాభమును పరిత్యజించి శత్రువును మర్దించుటకు పూనుకోవాలి. జయించవలెననే స్థిర సంకల్పంతో ఉపక్రమించాలి. కాలహరణము చేయుటకిక అవకాశం లేదు.

# జపానును జయించేవరకు అమెరికా నిద్రపోదు

## జోసెఫ్ గ్రూ ప్రకటన

న్యూహెవ్ఫర్డు, జూలై 4:—

ఇదివరలో జపానునందు అమెరికను రాయబారిగా పనిచేసియుండినట్టియు, ప్రస్తుతము, అమెరికా స్వదేశాంగ కార్యదర్శికి స్పెషలు అసిస్టెంటుగా ఉంటూవున్నట్టియు, జోసెఫ్ గ్రూగారు నేడు ఇట్లు చెప్పిరి:—

ఆసియాఖండమునకు మేము పంపగల్గినట్టి ప్రతి యుద్ధ సాధనమును పంపించుచున్నాము. మారవాణా ఆప్రాంతానికి క్రమేణ హెచ్చుతూ ఉన్నది.

హిట్లరును జయించిన తర్వాత జపానును జయించాలి అని వాదించేవారికి జపానును జయించడం యెంత పెద్ద కార్యభారమో బోధపడుటలేదు. ప్రస్తుతం ప్రపంచమంతటా అన్ని రంగములలోను మనము యుద్ధముసాగిస్తున్న మాట నిజమే.

ఏ యుద్ధరంగాన్ని మనము నిర్లక్ష్యం చేయడంలేదు. ఉత్తరాఫ్రికాలోను, రష్యాలోను మిత్రరాజ్యాలకు విజయం లభించింది. పసిఫిక్కు రంగంలోను, జర్మనీలోను మిత్రసేనలు ప్రవేశించి జయించుటకు అవకాశాలు కన్పించుచున్నవి ముందు జరుగవలసినయుద్ధం చాలాఉంది ప్రస్తుతం యుద్ధకభాసరణి మనకే అనుకూలంగావుంది.

జపానును జయించి జపాను తిరిగి తలయెత్తి విజృంభించకుండా చావగొట్టేవరకు అమెరికా నిద్రపోదు. అమెరికా తన యుద్ధకృషిని సడలింపజాలదు. అవశ్యంగా రూపుమాపేవరకు దానికి శస్త్రం చేస్తూనే ఉండాలి.

ముందు మనము చేయవలసిన మహాసంగ్రామం చేయుట ఓర్పి కన్నీళ్లు కార్చి రక్తము ఓర్చి చేయవలసియున్నాము. జపానుతో చేయవలసిన యుద్ధం ఎంత బ్రహ్మాండమైనదో అమెరికనులు ఒక పర్యాయం గ్రహిస్తేచాలు. అమెరికనుల సహజ దృఢ సంకల్పంతో యుద్ధమునకు పూనుకొని శత్రువును సాధింపగలరు.

# జర్మను అధికార్ల మంతనాలు

అంకారా, జూలై 5:—

ఫీల్డుమార్షల్ గోరింగ్, ఫీల్డుమార్షల్ మిల్చు, ఇతర జర్మను విమానాధికార్లు మూడురోజులు బెర్లిన్లో సంప్రదించి పశ్చిమరంగానికి వెళ్లిపోయారట రష్యానుంచి చాలా విమానాలు పశ్చిమరంగానికి వస్తాయని చెప్పుచున్నారట.

# జనరల్ జీరో అమెరికా ప్రయాణము

అల్జీర్సు, జూలై 4:—

జనరల్ జీరో మేజర్ బర్ఫీ, మే జర్ పొనియటోవిస్కీ-లతో సహా యిచ్చటినుండి వాషింగ్టనుకు బయలుదేరివెళ్లెనని నేడు అధికారికముగా ప్రకటింపబడెను. జనరల్ జీరో స్థానే ఫ్రెంచిసైన్యాధిపతిగా జనరల్ జూయిను పనిచేయుచున్నాడు.

## కేవలం సైనికసంబంధమైనది

వాషింగ్టను, జూలై 5:—

విమానములో దక్షిణ అట్లాంటిక్ మహాసముద్రమునుదాటి జనరల్ జీరో 24 గంటలలోపుగా వాషింగ్టను చేరునని తెలపబడుచున్నది. మెయిమీ చేరిన వెంటనే ఆయన ప్రెసిడెంటు రూజువెల్టుతో సంప్రదించు నిమిత్తమై వాషింగ్టనుకు బయలుదేరును. జనరల్ జీరో అమెరికాలో కొన్ని వారములపాటు ప్రసిడెంటు రూజువెల్టు అతిథిగా నుండును.

మార్టినిక్ కు రాయబారిని పంపుటకు అల్జీయర్సులో గావింపబడిన నిర్ణయమువల్ల మార్టినిక్ ద్వీప పరిపాలనమును మార్చు విషయమై అడ్మిరల్ రాబర్ట్సు గావించిన సూచనతో జనరల్ జీరోకు ప్రత్యేక సంబంధ మేమియు నుండదనియు, కేవలము సైనిక సంబంధములగు విషయములను విచారించుటకే జీరో అమెరికా వచ్చుచున్నాడనియు తెలపవచ్చును.

## మాడాం చాంకెషేక్ పునరాగమనము

చుంకింగు, జూలై 4:—

మాడాంచాంకేషేక్ నేడు చుంకింగుకు తిరిగివచ్చెను. ఆమె పునరాగమన వార్త కడుంగడు రహస్యముగా నుంచబడుటచే ఆమె భర్తపైతము విమానాశ్రయమునకు వచ్చి ప్రత్యుద్గానము చేయజాలకపోయెను. అమెరికను వైమానికులచే నడుపబడిన రవాణా విమానములో దిగినప్పుడు ఆమె చాలా బలిసియుండెను. ప్రయాణం నిరుపద్రవంగా జరిగెను.

## ఫీల్డు మార్షల్ గోరింగు అస్వస్థత

స్టాక్హోం, జూలై 3:—

గోట్సు బర్గు పత్రికయొక్క హాండెల్సు సజుఫార్టుకై డింగు, నమ్మకమైన వార్తల నాధారము చేసికొని యిట్లు వ్రాసెను:—

ఫీల్డు మార్షల్ గోరింగుకు చాలా జబ్బుగ నున్నది. ఆయన చాలా నీరసించి పోయినాడు. తీవ్రమైన హృద్రోగము చేతగూడ బాధపడుచున్నాడు. గురువారం రాత్రి ఆయనస్థితి చాలా అదుర్దా కలుగజేసెను. ఆతని భార్య రాత్రింబవళ్లు చెంతనే యుండి ఉపచారము చేయుచున్నది. చీఫ్ డిప్యూటీ కాన్సలుసభ్యుడుగా గోరింగుస్థానే జర్మనీ ప్రధానసైనికాధికారి ఫీల్డుమార్షల్ విల్ హెల్ము కెకెల్ నియమింపబడెను.

## జిబ్రాల్టరుకు క్రొత్త బ్రిటిష్ యుద్ధనావలు

లండను, జూలై 3:—

జిబ్రాల్టరు పరిసరమున నున్న స్పానిష్ ప్రాంతమునుండి వచ్చిన వార్తనాధారము చేసికొని జర్మను రేడియో ఈ క్రింది వార్త ప్రకటించెను:—

కింగ్ జార్జి దిఫిఫ్తు హౌ, అను 35 వేల టన్నుల నూతన బ్రిటిషు యుద్ధనావలు రెండు, నాల్గు బ్రిటిషు డిస్ట్రాయర్లు ఒక హోలెండుడిస్ట్రాయరు నేటిఉదయము మధ్యధరా సముద్రమునుండి జిబ్రాల్టరు వచ్చెను. అట్లాంటికు నుండి రవాణా నావలు కూడ వచ్చి తూర్పుగా మధ్యధరా సముద్రములోనికి వెళ్లెను. రెండు పెద్దనావలు జిబ్రాల్టరువద్ద విమానములను దించెను. ఆసుపత్రి నావలు గూడ జిబ్రాల్టరులో నున్నవి. బహుశః నివి గూడ మధ్యధరాలోనికి వెళ్లవచ్చును.

## వరిధాన్యమును మార్కెటు ధరకంటె తక్కువధరకు కొనుట

గుంటూరు, జూను 30:—

సహకార సంఘముల రిజిస్ట్రారు సత్యనాథన్ ఐ. సి. యస్. గారు జాయింటు రిజిస్ట్రారు శ్రీ సుబ్రహ్మణ్యం బాయుడు గారు గుంటూరు మార్కెటింగు సొసైటీ డైరెక్టరులు యితర సహకార సంఘముల ప్రతినిధులతో అనేక సహకారసంస్థల నిర్వాహకులుగూర్చి ఇష్టాగోష్టిగా చర్చలు జరిపిరి. సహకార అమ్మకాల సంఘాలవద్ద తాకట్టు యుంచబడిన వరిధాన్యమును నెల్లూరు ధాన్యం కొనుగోలు 'అఫీసరు మార్కెటు ధరలకంటె తక్కువ ధరలకు నిర్ణయింపరాదని తీసుకొనుట అన్యాయమని యీ రైతులకు కనీసము మార్కెటు ధరలైనా యివ్వాలనియు జిల్లా సహకార మార్కెటింగు సొసైటీ అధ్యక్షుడు శ్రీ ఐ. యల్. నారాయణగారు రిజిస్ట్రారుకు ఒక విజ్ఞప్తిలో తెలుపుకొనిరి.







# "ప్రిన్సిపల్‌కు బాగా తెలుసు"

## లయోలాకాలేజి ప్రొఫెసరు ప్రకటన

మద్రాసు, జూలై 5:—

లయోలాకాలేజిలో 11 ఏండ్లుగ పనిచేసి రాజీనామానిచ్చిన ఇంగ్లీషు ప్రొఫెసరు శ్రీ కె. సుబ్రహ్మణ్యంగారు మాక్రిందివిధముగ వ్రాయుచున్నారు.

"నేను 11 ఏండ్లు పనిచేసిన కాలేజినిగూర్చి పత్రికలలో బహిరంగంగా వివాదములోకి దిగటం నా తత్వానికి గిట్టనిది. అయినా నా ప్రతినిధిని నన్ను మానవుని లయోలా కాలేజి ప్రిన్సిపాల్ చెప్పినందున, మీ ప్రతినిధి అడిగినందున నేనీక్రిందిమాటలు వ్రాయవలసి వచ్చింది. ప్రిన్సిపాల్ చెప్పినటుల రామకృష్ణ మిషనువంటి సంస్థలో సేవచేయవలెనని నాకు చిరాభిలాష యున్నమాట సత్యమే. అయితే కాలేజిలోని పరిస్థితుల మూలమునను విరిగి నేను రాజీనామా ఇచ్చిన మాట గూడా అంతే సత్యమే. కాలేజిలోని పరిస్థితులు నా కెంత కష్టము కలిగించినవో ప్రిన్సిపాలుకే తెలియును. నాతో మాట్లాడియున్నపుడు ఆయన ఈ విషయము నంగీకరించియున్నాడుగూడా."

ఇంతటితో నాకు సంబంధించినంతవరకు వివాద ముగిసినది.

## రుక్మిణీదేవి భరతనాట్యము

శ్రీ రుక్మిణీదేవిగారు నిన్నరాత్రి అడయారు కళాక్షేత్రమునందు భరతనాట్య ప్రదర్శనము గావించిరి. పురప్రముఖులు, కళాభిమానులు అనేకులు విచ్చేసిరి. ముత్తుస్వామి పాటలు, అన్నియు భక్తి గీతములు, వివిధ నృత్యభంగిమములు ప్రదర్శించిరి. అనుగొన్న యజ్ఞపిళ్ళెగారు వ్రాసిన "నిన్నె కోరియున్నానురా, నిరాకరింపకురా" అను తెలుగు వర్ణము రాగమాలికను కడు రమ్యముగ ప్రదర్శించిరి. "రామా సీతామనోహర" అను త్యాగరాయ కృతియు, అరుణాచల కవిగారు రచించిన శంకరాభరణ రాగములోని నిందాస్తుతి గీతమును, ఆ భాష తెలియనివారికి గూడ, భావము స్పష్టమయ్యేటట్లు నృత్యము చేసి, ప్రేక్షకుల మన్ననలకు పాత్రులయిరి.

## మోసం చేసినందుకు అరెస్టు

రాజారెట్టి అనువానిని మరి ముగ్గురిని యీ వాళ ఉదయం రాయపురం పోలీసులు పాతాళవినాయకుని వీధిలో ఒక యింటియందు అరెస్టుచేసిరి. ఈ నలుగురు వ్యక్తులు సుందరం అను వతనివద్దనుండి రూ 180 తీసికొని ఆ మొత్తమును రెండింతలు చేసి యిచ్చేలాగున చెప్పి మోసకృత్యంతో పైకమును అపహరించిరని తెలుస్తున్నది.

## పాటల ప్రచారోద్యోగి

వి. ఎం. బాలసుబ్రహ్మణ్యంగారు (అడ్వకేటు) రాష్ట్రీయ పాటల ప్రచారోద్యోగిగ నియమింపబడిరి.

## రాకపోకలు

సర్ సి. వి. రామన్ గారు నిన్నరాత్రి బెంగుళూరుకు డా|| వి. సుబ్బరాయన్ గారు శంకరి దుర్గమునకు ఆన్నామలై విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ యం. రత్నస్వామి గారు చిదంబరమునకు సహకార సంఘముల రిజిస్ట్రారు జనరలు వెళ్లిరి. ఆర్. యస్. సత్యనాథన్ గారు కొడైకెనాలుకు వెళ్లిరి.

క్రొత్త రాజధాని బొంబాయిహైస్ సి. షెరాక్ స్మిత్ గారు కలకత్తానుండి నిన్న ఉదయం చెన్నపురికి వచ్చిరి.

## శ్రీ శ్రీ|| నీలం కోదండరామయ్యగారు

సామర్లకోట, జూలై 2:—

సామర్లకోట గ్రామ మునసబుగారైన శ్రీ నీలం కోదండరామయ్యగారు జూను 29 వ తేదిన తమ గృహమునందు స్వర్గస్థులైరి. వీరు ఆంధ్రరాష్ట్ర గ్రామోద్యోగుల సంఘమునకు కార్యదర్శులుగా నుండిరి. (ఎ. వి)

# చీరాల చేనేత కేంద్రంగ ఏర్పాటుచేయవలెను

## సహకారసంఘం నూలును లాభానికి అమ్మకూడదు

రిజిష్ట్రారుకు గుంటూరు చేనేత పారిశ్రామికుల విజ్ఞప్తి

నిడుబ్రోలు, జూలై 1:— గుంటూరుజిల్లా చేనేత పారిశ్రామికుల సంఘ కార్యవర్గంవారిచే నియమింపబడిన రాయబారవర్గం శ్రీ అవురాతి రంగనాయకులు, సద్దంటి శేషయ్య, పృథివి సూర్యబాలానందం, శాటిపర్తి శ్రీ కంఠంగార్లు నిన్నటిదినం మద్రాసు సహకారసంఘాల రిజిష్ట్రారు గారిని దర్శించటానికి వెళ్లగా, వారికి కొంచెం అస్వస్థతగా వుండటం కారణంతో, గుంటూరుజిల్లా సహకారసంఘాల డిప్యూటీ రిజిష్ట్రారు గారికిని, మద్రాసు చేనేతసహకారసంఘాల ప్రత్యేక డిప్యూటీ రిజిష్ట్రారుగారికిన్ని యీదిగువ విషయాలనుగూర్చి రాయబారవర్గంవారు ఒక మెమోరాండంను సమర్పించిరి.

### మెమోరాండం

నూలు, వస్త్రములధరల కంట్రోలు ఆర్డరు ప్రకటింపబడిన ఫలితముగా, వస్త్ర వ్యాపారం స్తంభించిపోయినందున, గుంటూరు జిల్లాలోని పావుకోర్లు, ముఖ్యముగా చీరాల ప్రాంతాలలోనివారు మగ్గాలకు పనియివ్వటం మానివేశారు. ఇందుమూలముగా ఆ ప్రాంతాల్లోవున్న 8 వేల మగ్గాలకు పనిలేకుండా పోయింది. ఈ పారిశ్రామికులకు పనికల్పించుటకు గాను స్థానికము గా పనిచేయుచున్న చీరాల, వేటపాలెం, పందిళ్లపల్లి సహకారసంఘములలో చౌకబట్ట ఉత్పత్తిని అధికం చేయించి హెచ్చు పారిశ్రామికులకు పని కల్పించవలెననియు, చీరాలలో ఒక చేనేతకేంద్రాన్ని యేర్పాటుచేయించి, పారిశ్రామికులకు పని కల్పించాలని కోరినారు.

### సహకారసంఘం లాభానికి నూలు అమ్మకూడదు

చౌకబట్ట ఉత్పత్తికి మజూరీలను హెచ్చించాలనియు, రాష్ట్రీయసహకారసంఘం ప్రతినెలా మిల్లులనుండి పాయినల్ రేట్లకు కొంటూవున్న 2000 బేళ్లలో కొంతభాగాన్ని లాభాలకు అమ్ముకొంటూవున్న విధానాన్ని నిలుపుదలచేయించి, మొత్తం 2 వేల బేళ్లను చౌకబట్ట ఉత్పత్తికి ఉపయోగించి, ప్రజ సామాన్యమునకు హెచ్చు బట్టను అందచేయించాలనియు కోరినారు.

రాయబారవర్గంవారు విన్నవించిన విషయాలను ఓర్పుతో విని, చేతనైన సహాయమును చేయుదుమని అధికారులు చెప్పినారు.

### చేనేత పారిశ్రామికులు తక్కువ మజూరీ లంగీకరించిరి

నిన్నటిదినం గుంటూరులో కోఆపరేటివ మార్కెటింగు ఫెడరేషన్ కార్యాలయ ఆవరణలో, మద్రాసు సహకారసంఘాల రిజిష్ట్రారుగారైన శ్రీ సత్యనాథన్ గారియెదుట, గుంటూరు జిల్లా చేనేత పారిశ్రామికుల సహకారసంఘాల ప్రతినిధుల సమావేశం జరిగెను.

ప్రతినిధుల తరఫున శ్రీ ప్రగడ కోటయ్యగారు రిజిష్ట్రారు గారికి మజూరీల గూర్చి విన్నవించుచు ఈ జిల్లాలోగల చేనేత సహకార సంఘాలవారందరూ, సాధారణబట్ట ఉత్పత్తిని నిలుపుదలచేసి, చౌకబట్ట ఉత్పత్తిని మాత్రమే చేయుటకు నిశ్చయించుకొనియున్నారనియు కొని, చౌకబట్ట ఉత్పత్తి నిర్ణయించిన మజూరీలు బహుస్వల్పమై, నేతపన్నుల జీవితావసరములకు చాలకున్నవనియు, అందువలన మజూరీలను హెచ్చించుట అవసరమనియు చెప్పిరి.

రిజిష్ట్రారుగారు మజూరీల పెంచుట కష్టమని చెప్పగా, చౌకబట్ట ఉత్పత్తి విధానంలో పాల్గొని, ప్రజాసామాన్యమునకు చౌకబట్ట అందచేయాలనే సంకల్పముతో, ఆ తక్కువ మజూరీలకే, చౌకబట్టను తయారుచేయుటకు ప్రతినిధులందరూ తమ నిర్ణయాన్ని రిజిష్ట్రారు గారికి తెలియపర్చినారు.

### ఖద్దరు ఉత్పత్తి సంఘాలు

ఖద్దరు ఉత్పత్తి సంఘాల తరఫున శ్రీ రావు వెంకటరామయ్యంగారు, ఖద్దరు సంఘాలకు ప్రత్యేకంగా రాష్ట్రీయ సహకారసంఘం ఏమి సహాయము చేయుటలేదు కాబట్టి ప్రభుత్వంవారు ఇస్తూవున్న విరాళాన్ని యీనా, నిలుపుదల చేయక, యిస్తూ యుండాలని కోరారు. ఇంతేగాక, తమిళ సంఘాలకువలెనే అర్థిక పరిస్థితుల ననుసరించి, వాటికి విరాళ సహాయం చేస్తూవుండాలని విన్నవించారు. (స్వ. వి.)

# సూరజమల్స్

వజ్రములు

నమ్మకమైన నగల వర్తకులు,

313, ఎస్ప్లనేడ్, - - మద్రాసు.

# పంటల ఉత్పత్తి అంచనాలు

## బియ్యంపంట తగ్గు సూచన

న్యూఢిల్లీ, జూలై 3:— 1942-43 సంవత్సరం పంటల అంచనాలు ప్రకటింపబడినవి. ఈలెక్కలను చూడ ఈ సంవత్సరం వరిపంట అనుకున్న దానికన్న తక్కువగ నుండుననియు జనపనార, వేరుశనగ, ఆముదాలు, అవిశగింజలపంట కొంత అధికముగ నుండగలదనియు తెలియుచున్నది. ఆహారధాన్యాల ఉత్పత్తిని అధికముచేయవలయునని ప్రభుత్వమువారు గొప్పప్రచారము సలుపుచున్నందున ఈలెక్కలకు అధికముప్రాముఖ్య మేర్పడుచున్నది.

కడచిన సంవత్సరంకన్న ఈసంవత్సరం జనపనారపంట నూటికి 66 చొప్పున, ఆముదాలపంట నూటికి 62 చొప్పున వేరుశనగ నూటికి 4 చొప్పున, అవిశగింజలపంట నూటికి 14 చొప్పున అధికముగ నుండునని అంచనా వేయబడినది. ప్రత్తిపంటమాత్రము ఈ సంవత్సరం కడచిన సంవత్సరంకన్న నూటికి 74 చొప్పున తక్కువగ నుండును.

కడచిన సంవత్సరంకన్న గోధుమపంట నూటికి 9½ చొప్పున చెరుకు నూటికి 30 చొప్పున అధికముగ నుండునని అంచనా. గోధుమలు సాగుచేయబడు భూమి విస్తీర్ణం సంస్థానాలలో నూటికి 0-4-0 చొప్పున అధికమైనను, బ్రిటిషుఇండియాలో నూటికి 1 చొప్పున తగ్గినది.

# కాళీ విగ్రహ విధ్వంసం

## పిచ్చివాని సాహసం

సిలహటు, జూలై 4:— ఆసాములో సిలహటులో మిక్కిలి విఖ్యాతిమైన కదంహాత కాళికాదేవి ఆలయం ఒకటి వుంది. ఇది చాలా పురాతన మయినది. ఒక పిచ్చివాడు గుడిలో ప్రవేశించాడు. వీడు కాళికాదేవి విగ్రహాన్ని వుద్దేశించి కొన్ని ప్రశ్నలడిగాడు. విగ్రహం జవాబు చెప్పలేదు అందువల్ల కోపంవచ్చి పిచ్చివాడు కాళికాదేవి విగ్రహాన్ని ముక్కలు ముక్కలుగా పగలగొట్టేశాడు. వీడు హిందువే.

# బరిసె పోటువల్ల యువకుని మరణం

## గ్రామకక్షల పరిణామం

తెనాలి, జూలై 2:— తెనాలితాలూకా ఈపూరు గ్రామంలోని ఇరుకక్షులవారికి దెబ్బలాట జరిగినది. బరిసె పోటువలన 25 సం॥ వయస్సుగల మెడబలి వెంచారావు అను యువకుడు మరణించెను. ఈ సందర్భంలో కొల్లూరు పోలీసువారు 1. కనుపర్తి పెదవీరడు, 2. పెదపల్లి సుబ్బడు, 3. కొమ్మినేని క్రిష్ణారావు, 4. కొమ్మినేని హరిశ్చంద్రుడు, 5. తేళ్ల పిచ్చిగాడు, 6. బత్తిపూడి ఎల్లడు, 7. మంచాల వెంకటసుబ్బడు, 8. గర్రాల సూరయ్య అనువారిని అరెస్టుగావించిరి. (స్వ. వి.)

# అఖిల భారత వాతావరణం

పూనా, జూలై 5:— (1) అత్యధిక (2) అల్పోష్ణములు (3) గడచిన 24 గంటలలో వానబడ్డ వివరాలు జూలై 1 వ తేదీ ఉదయం 8 గంటల వరకు లెక్కలు దిగువప్రకటింప బడియున్నది.

| | (1) | (2) | (3) |
|---|---|---|---|
| అలహాబాదు | 109 | 91 | 0 |
| బొంబాయి | 88 | 76 | 0.8 |
| కలకత్తా | 94 | 79 | 1 62 |
| కాన్పూరు | 108 | 88 | 0 |
| కటకం | 94 | 86 | 0 |
| డార్జిలింగ్ | 63 | 57 | 3.68 |
| ఢిల్లీ | 108 | 83 | 0 |
| డేరా డన్ | 99 | 76 | 0 |
| జకోబాబాద్ | 104 | 86 | 0 |
| కరాచి | 90 | 83 | 0 |
| లాహోరు | 91 | 76 | — |
| లక్నో | 108 | 85 | 0 |
| మద్రాసు | 92 | 78 | 0 |
| నాగపూరు | 93 | 79 | 0 |
| పాట్నా | 97 | 81 | 0 |
| పెషావరు | 105 | 80 | 0 |
| షిల్లాంగ్ | 78 | 64 | 2 8 |
| సిమ్లా | 76 | 64 | 0.6 |

# భారత రాజకీయ అవష్టంభము

## "తొలగించు ఉద్దేశ్యము బ్రిటనుకు లేదు".

### శ్రీ ముత్తురంగ మొదలియార్ గారి ప్రకటన

ఆరోగ్యము సరిగాలేనికారణముచే ఇటీవల జైలునుంచి విడుదలచేయబడిన శ్రీ సి. ఎన్. ముత్తురంగ మొదలియార్ గారు ప్రస్తుత దేశపరిస్థితులను గురించి ఒక ప్రకటన చేసిరి. అందు మొదలియారు గారు స్వర్గీయ యస్. సత్యమూర్తిగారిని ప్రశంసించుచు, శ్రీ సత్యమూర్తిగారికి మద్రాసులో తగిన స్మారకచిహ్నము ఏర్పరుపబడునని తామాశించుచున్నామని తెల్పిరి. సత్యమూర్తిగారి స్థానమున జరిగిన ఉపయెన్నికలలో కాంగ్రెసుకు కలిగిన అఖండవిజయమునకు శ్రీమతి రుక్మిణమ్మగారిని, శ్రీ గద్దె రంగయ్యనాయుడు గారిని, తదితర కాంగ్రెసువర్కరులను అభిమానులను ముత్తురంగ మొదలియారు గారు మనఃపూర్వకముగా అభినందించిరి. 'మంత్రివర్గాన్ని స్థాపించాలని ఆరాటపడే కొద్దిమందికి ఈ ఉపఎన్నిక ఫలితం కనువిప్పవుతుందని తలుస్తాను. ఇప్పటికీ ప్రీమ్ ప్రయత్నం మానకపోతే బయటవున్న కాంగ్రెసు శాసనసభాసభ్యులు నిస్సందేహంగా ఇట్టిప్రయత్నాలు వుకెటిలోనే ఎన్నెమ్మ కొట్టిపోయేటట్లుచేస్తారు' అని ముత్తురంగ మొదలియారు గారు తెల్పుచున్నారు.

ప్రస్తుత రాజకీయస్థితిని ప్రస్తావించుచు బ్రిటిషుప్రభుత్వం కాంగ్రెసుతోగాని, ఇతర రాజకీయపక్షాలతో గాని రాజీపడటానికి కొందరపడటంలేదనీ, అమెరికా ప్రజ లేమనుకున్నా, ఇంగ్లండులో సర్వమానవ స్వాతంత్ర్యాభిలాషులను కొద్దిమంది రాజకీయవాదులేమనుకొన్నా తాము మాత్రం తమ ప్రస్తుత పద్ధతినే సాగించ నిశ్చయించుకొనిరనియు, ప్రెసిడెంటు రూజువెల్టు మిత్రమండలి భాగస్వాములలో తనకు పూర్వికుడయిన చర్చిలును మించి ఏమాత్రం ముందుకు పోడనీ, అమెరికా ఏమనుకున్నా, ప్రెసిడెంటు రూజువెల్టు ఉద్ఘాటించిన నాల్గు స్వాతంత్ర్యములు ఆసియాజాతులకు వర్తింపచేయ్యటకు కనుపింపదనియు, కాబట్టి స్వబుద్ధితో గాని అమెరికా జోక్యంవల్లగాని బ్రిటిషు ప్రభుత్వ ప్రస్తుతపు అవష్టంభనం తొలగింపవచ్చునని తలంచటం వ్యర్థమని శ్రీ మొదలియారు గారు తెల్పిరి.

### జిన్నాగారిపై ఆశవదులుకోవాలి

శ్రీ ముత్తురంగ మొదలియార్ గారు ఇంకను ఇట్లు వ్రాయుచున్నారు.

జిన్నాగారు కాంగ్రెసుతో రాజీ కోరటంలేదు. అవష్టంభనం సాగుతూండవలెననే వారి కోరిక. ప్రభుత్వం తమమీద దురభిప్రాయం పడటానికి ఆయన తయారుగా లేదు స్వాతంత్ర్యం ఆయనకక్కరలేదు ఈసంగతి తెలుసుకుని మనం జిన్నాగారితో సంధిచేసుకోవాలనే అభిప్రాయం వదులుకోవాలి. హిందూ-ముస్లిము సామరస్యమునకు కావాలి. ముస్లిము పక్షములన్నిటిలో ముఖ్యమైన ముస్లిములీగుతో మనం నిక్కయంగా వ్యవహరిస్తాము. కాని ఇదంతా దేశ స్వాతంత్ర్యం ప్రధానంగా పెట్టుకుని చేస్తాము. కాబట్టి ఈపైన కాంగ్రెసు, నిరంకుశ ఫాసిస్టు అగ్రకారిగానున్న జిన్నాగారికి ముస్లింలీగు స్వస్తిచెప్పినపుడే, ముస్లిములీగుతో సంప్రదించుతుంది. భారతదేశమందలి ముస్లిము ప్రజలు తమకు దేశస్వాతంత్ర్యం కావలసినదీ, జిన్నాగారి నాయకత్వం కావలసినదీ ఇప్పుడు నిర్ణయించుకోవాలి.

### డా. సుబ్బరాయన్ గారి వేడికోలు

దూరంగానున్న ఒక రాష్ట్రంలో, మేము అలవాటుపడియుండని అత్యధిక శీతోష్ణములు కలచోట నిర్బంధింపబడియుండే భాగ్యం మాకు మద్రాసుప్రభుత్వం కలిగించింది. మా ఆసౌకర్యాలను సంతోషంగా అనుభవించాము. ఎండ 115 డిగ్రీలుండినా మేము మనోనిశ్చయంతో సంతోషంగా ఆ వేడిని అలవాటుచేసుకొన్నామేగాని తలక్రిందులుకాలేదు. మమ్మల్ని ఎక్కువగా బాధపెట్టిందల్లా గాంధిగారిని విడిపించగోరుతూ డా. సుబ్బరాయన్ గారు జిన్నాగారికి విన్నవించుకుంటూ చేసిన స్టేటుమెంట్లు. డా. సుబ్బరాయన్ గారు బ్రిటిషు మంత్రివర్గములో ఒకరితో మేమంతా బుద్ధిమంతులమేననీ, మమ్మల్ని వదిలిపెట్టవలసినదనీ, ఈ దేశానికి జాతీయప్రభుత్వం ప్రసాదించవలసిన పనీ ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నట్లు వచ్చిన ఒకవార్త మమ్మల్ని చాలా బాధించింది. గాంధిగారూ, కాంగ్రెసు సాధించలేని దానిని డా॥ సుబ్బరాయన్ గారు ఉత్తర ప్రత్యుత్తరాలతో సంపాదింపగలిగితే అది నిజంగా ఇంద్రజాలమే"

వెల్లూరుజైలునుంచి తమతోపాటు అనురావటైలుకు మార్పబడిన శ్రీ కుప్పస్వామి మొదలియార్ గారు 7 నెలలనుండి జబ్బుగా నుండి ఇర్విన్ ఆసుపత్రిలో చికిత్సపొందుతూన్నా వారి స్థితి ప్రమాదకరంగా ఉందనీ, మదరాసు ప్రభుత్వము వెంటనే వారిని మదరాసు జనరల్ ఆసుపత్రికి తీసుకురావటంగాని, పెరోలు మీద విడుదలగాని చెయ్యాలని శ్రీ మొదలియారుగారు వ్రాస్తున్నారు.

# తిండిలేక 70 మంది మరణించారు

## బాలసోరుజిల్లా మేజస్ట్రేటు రిపోర్టు

కటకు, జూలై 4:— నిన్నను కటకులో ఉత్కళ అసెంబ్లీ సభ జరిగింది. ఈసభలో పార్లమెంటరీ సెక్రటరీ ప్యారీశంకరరాయిగారు కీలాను చెప్పారు ఉత్కళరాష్ట్రంలో తిండి లేకపోవడంవల్ల కొంతమంది చనిపోయారు పుష్టికలగడానికి తగినంత తిండి దొరకకపోవడంవల్ల బాలసోరుజిల్లాలో 70 మంది చనిపోయారని బాలసోరు జిల్లామేజస్ట్రేటు ప్రభుత్వంవారికి రిపోర్టు పంపాడు. వీళ్ళందరున్నూ ముసలివాళ్లు మిక్కిలి బలహీనంగా కూడా వున్నారు. అందువల్లనే వీళ్లు చనిపోయారు. కేవలం తిండిలేక పోవడంవల్ల కొన్నిరోజులపాటు పస్తులుపడి వుండడంవల్లనే యెందరు చనిపోయారో తెలియలేదు.

# కాందిశీకుల కడగండ్లు

(1-వ పేజీ తరువాయి)

పద్ధతిలో మాత్రము మార్పు జరగలేదు. కాందిశీకులు మున్నరు ఆఫీసర్లదగ్గరకు యథాప్రకారముగ తిరుగవలసి వచ్చుచున్నది కాందిశీకుల అలవెన్సుల నిచ్చే యీముస్సరు ఆఫీసర్లు కేంద్రప్రభుత్వపు ఉత్తరువుల ననుసరించకుండా తమయిష్టము వచ్చినరీతిని అలవెన్సుల ప్రతిమారు తగ్గించుచున్నారు. ఇట్టి అన్యాయము తెలుగు కాందిశీకులకే జరుగుచున్నదని భావించవలెను. ఈప్రస్తుత పద్ధతి మారి మొదటివలెనే కాందిశీకుల దరఖాస్తులు ఆసిమలుజిల్లా లేబరుఆఫీసరు ద్వారా కలెక్టరు మంజూరుచేసి, డబ్బు ఎ. డి. ఎల్. ఓ. ద్వారా బట్వాడాచేయించినయెడల కాందిశీకుల యిక్కట్లు ప్రభుత్వమువారు కొంతవరకు బాపినవారగుదురు.

### కాకినాడ రిఫ్యూజీహోమ్

1942 నవంబరులో కాకినాడ లక్ష్మీ రిఫ్యూజీహోము బర్మా కాందిశీకులనిమిత్తం అప్పటి జిల్లాకలెక్టరు శ్రీ టి. భాస్కరరావునాయుడుగారి సతీమణిచే తెరువబడెను. 300 మంది కాందిశీకులకు నవంబరు (1942) మొదలు జనవరి (1943) వరకు రిఫ్యూజీహోములో ఆశ్రయమిచ్చి భోజనమేర్పాటుచేసిరి. వీరికి రెడ్ క్రాస్ సంఘంవారు రు 1000 ల బట్టలు కొనియిచ్చిరి. ప్రనివారము వారి స్నానమునిమిత్తం నూనె, కుంకుడుకాయలు, సున్నిపిండి, సబ్బు ప్రభుత్వమువారు సరఫరాచేసిరి. వారి ఆరోగ్యం గురించి డా॥ (A. D. M. O.) గారు పరీక్షచేయుచుండిరి.

శ్రీమతి లక్ష్మీదేవి (కలెక్టరు గారి భార్య) ప్రతివారము ఒకరోజున రెఫ్యూజీహోముకు వెళ్లి వారిమంచిచెడ్డలు విచారించి పిల్లలకు పాలు, మిఠాయి, అరటిపండ్లు బట్టలు పంచిపెట్టించేవారు. 28-1-1943 తేదీన కలెక్టరు మద్రాసుకు ట్రాన్సఫర్ అయిరి, ఆసమ్మట రిఫ్యూజీహోముల పరిస్థితి నానాటికి క్షీణించెను. ప్రస్తుతం అందులో ముప్పయిమందికి ఎక్కువ లేరు. ఏవిధమైన సదుపాయము కానక హోములోని కాందిశీకులు చెదరిపోయిరి. ఈ రెఫ్యూజీహోము త్వరలో మూసివేయుదురని కూడ తెలియుచున్నది.

### కాందిశీకుల సలహాసంఘము

తూర్పుగోదావరిజిల్లా బర్మా కాందిశీకుల సహాయసంఘములో సభ్యులు, కార్యనిర్వాహకులు కాందిశీకులే. సంఘాధ్యక్షులు శ్రీ ఆర్. రాజారావుగారు. వీరు కాందిశీకుల యెడల ఎక్కువ ఆదరాభిమానములతో, వ్యయ ప్రయాసలకోర్చి పనిచేసిరి. ఈ సంఘము ప్రారంభించిన మొదటి రోజుల్లో కమిటీసభ్యులు ఉత్సాహంతో పనిచేశారు. అప్పటి జిల్లాకలెక్టరైన భాస్కరరావు నాయుడుగారు యీ సంఘ తీర్మానాలు, విజ్ఞాపనలు, సిఫార్సులు సానుభూతితో చూచుచు తమచేతనయినంత సహాయమును కాందిశీకులకు కలుగజేయించుచుండెడివారు. వారు మద్రాసు ట్రాన్సఫర్ అయిన తర్వాత యీ జిల్లా అధికారులు కాందిశీకుల యెడల తగినంత శ్రద్ధ కనుబరచక పోవుటచేత యీ సహాయసంఘ సభ్యులలో ఉత్సాహము తగ్గెను. సంఘ కార్యాలయపు ఖర్చులు భరించుటకూడ కష్టముగానున్నది. ప్రభుత్వము వారిప్పటికి యిందునిమిత్తమై రు 100 లు మాత్రము (9 మాసములకు) మంజూరు చేసిరి. ప్రస్తుత జిల్లా అధికారులు కాందిశీకుల సహాయసంఘానికి తగిన ప్రోత్సాహమొసంగకపోవుటచేత సభ్యులు యీ సంఘాన్ని యింతటితో ముగించుటకు తీర్మానించినట్లు తెలియుచున్నది. ఈ సంఘమును మూసివేయుటవలన నిజముగా యీ జిల్లాలో కాందిశీకులకు యిబ్బందులు మరింత హెచ్చునటుకు సందియము లేదు.

కాందిశీకుల అలవెన్సుల గురించిన కేంద్ర ప్రభుత్వమువారి ఉత్తరవు జూన్ నెలాఖరుతో అంతమొందును. తిరిగి అలవెన్సుల నిచ్చుటకు కాలపరిమితి హెచ్చించినట్లు అధికారరీత్యా ప్రకటన వెలువడలేదు. అలవెన్సుల కాలపరిమితి పొడిగించనియెడల కాందిశీకులు యింకను నిరాధారులై పెక్కుబాధలకు లోనగుదురు. తెలుగుజిల్లాలలోని కాందిశీకులకు ఒక తెలుగు రెఫ్యూజీ ఆఫీసరుని ప్రత్యేకంగా ప్రభుత్వమువారు నియమించుట చాల అవసరము.

# స్టాండర్డు వస్త్రాలు

## పట్నాలందే విక్రయింపబడును

### ఈనెలలో 189 లక్షల గజాలు విక్రయమగును

మదరాసు, జూలై 5:— చెన్నరాష్ట్రము కనుగొని నిర్ణయింపబడిన మిల్లు స్టాండర్డు వస్త్రాలికోటా 189 లక్షల గజాలు యీ నెలాఖరులోగా చేరగలదు. మదరాసులోను మునిసిపాలిటీలు గల నగరాలందు మాత్రమే దీన్ని విక్రయించుటకు ప్రస్తుతము ఏర్పాటులు జరుగుచున్నవి. మిల్లులందు వస్త్రం తయారై రవానాకు సిద్ధంగానున్నను, విక్రయంయేర్పాటులు పూర్తికానందున యింతవరకు సరకు బజారులోనికి రాలేదని తెలియుచున్నది.

స్టాండర్డుక్లాతు యేర్పాటుల గూర్చి సలహాచేయ ప్రభుత్వంవారు నియమించిన సలహాసంఘం యిటీవల సమావేశమయి, ప్రస్తుతం వరకు మితంగానున్నందున నగరాలలో మాత్రమే, లైసెన్సుపొందిన దుకాణాల ద్వారా దీన్ని విక్రయించాలనియు, ఆ దుకాణదారులైనా ప్రత్యేకంగా స్టాండర్డు వస్త్రాలు విక్రయించాలికాని, యితర రకం వస్త్రంతో కలిపి విక్రయించరాదనియు నిర్ణయించిరి. రాష్ట్రీయ చేనేత సహకార సంఘమువారి విక్రయశాలలలో మిల్లు స్టాండర్డు సరకు విక్రయింప బడదు. ఇతర సహకార సంఘములపై సెన్సు కోరినచో కోఆపరేటివు రిజిస్ట్రారుగారితో సంప్రదించి యీరకముకమిషనరుగారు, ఆయా సంఘాల యోగ్యతను బట్టి ఆలోచింతురు. జిల్లాలలో విక్రయ సదుపాయాల గూర్చి యోచించుటకు జిల్లా సలహాసంఘములు నియమింప జిల్లా కలక్టరులు కోరబడిరి.

చెన్నరాష్ట్రమునకు మిల్లు స్టాండర్డు వస్త్రం ఆగస్టునుండి జనవరివరకు కోటా 1260 లక్షల గజములుగ నిర్ణయింపబడింది. తొలికోటా ఆగస్టు 15 లోగా రెల్లిపోగాదే ఇదిదినము తయనను. ఈ వస్త్రం తయారయిన మిల్లులనుండే విక్రయించబడే జిల్లా కేంద్రాలకు సరాసరి ఎగుమతిచేయుటకు కేంద్ర ప్రభుత్వంవారు అంగీకరించిరి. కనుక సరకు చేరుటకు ఆలస్యము కాదని ఎంచబడుచున్నది. విక్రయదారులపై సెన్సు యేర్పాటులన్ని పూర్తియై, సరకు బజారులోనికి జులయి ఆఖరులోగా రాగలదని అధికారరీత్యా తెలియుచున్నది.

### ధరలు తగ్గెను

ఇండియా ప్రభుత్వంవారు నిర్ణయించిన కేన్సిలైను కంట్రోలు ఉత్తరవు అక్టోబరునుండి అమలు జరుగును కావునను, అలాగా యిపుడున్న సరకు వర్తకులు విక్రయం చేయాలని విధించుబడేతను, వ్యాపారస్తులకు భీతికలిగి, గతవారంరోజులనుండి మదరాసు మార్కెట్టులో వస్త్రాల ధరలు కొన్నిచోట్ల కొందరు మాత్రం తగ్గించిరి. కాని నిలకడగ లేవు.

# హిందూధర్మాదాయముల బోర్డు

మదరాసు, జూలై 5:— మదరాసు హిందూధర్మాదాయముల బోర్డు అధ్యక్షులు వివిధ డివిజనుల పరిపాలన ఆయా కమిషనరులకు యీదిగువ రీతిని యీ నెల మొదటి నుండి విభజించిరి:—

1. ఉత్తరడివిజను:— శ్రీ పురాణపండా కామేశ్వరరావు గారు:— విశాఖపట్నము, ఉభయ గోదావరి, కృష్ణ, గుంటూరు, కర్నూలు, కడప, బళ్ళారి.

2 దక్షిణ డివిజను:— రా. బ., సి యం రామచంద్ర చెట్టి గారు:— నెల్లూరు, చెంగల్పట్టు, ద. కనరా, సేలం, తిరుచునాపల్లి, తంజావూరు.

3. పడమర డివిజను:— శ్రీ ఎ. యస్. మన్నడినాయరు గారు:— కోయంబత్తూరు, మలబారు, ద. కనరా, మధుర, రామ్నాడు, టిన్నవెల్లి.

4. దీ. బ, టి. యం. నారాయణస్వామి పిళ్ళెగారు, అధ్యక్షులు మధ్య డివిజను:— చిత్తూరు, నీలగిరి, ఉత్తరార్కాటు, అనంతపురం, రామ్నాడు మొదలైనవాని లోను రూ 20000 రాబడికి దేవస్థానము లన్నింటిపై అధికారము అధ్యక్షుని కుండును. కమిషనరులకు ఆయా ప్రాంతాలలో ఇరువది వేలకు లోపు దేవాలయములపైనే అధికారముండును.

# నరసారావుపేటకు న్యూస్ వెండరు కావాలి

నరసారావుపేటలో మా ఆంధ్ర దిన, సచిత్రవార, భారతి పత్రికలను వారి స్వంత బాధ్యతమీద అమ్ముటకు న్యూస్ వెండరు కావాలి స్థానికులై వుండి రూ 300/- లు ధరావతు చెల్లించగలవారే దరఖాస్తులు పంపవలెను.

మేనేజరు, ఆంధ్రపత్రిక.











Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty Street, Madras.